# చీకటి నీడలు

(కవితా సంపుటి)

"ఊహకీ వాస్తవానికీ,
క్రియకీ, కదలికకీ
మధ్య వ్యవధిలో
నీడలు పడుతున్నయ్"

## బైరాగి

ఏ. బి. సి. ప్రచురణలు

# చీకటి నీడలు

అమ్మా!

ఈ కవిత్వాల ప్రతిచరణంలో
బ్రతికియున్న,
ప్రతి శబ్దంలో పలుకరిస్తున్న
నీకు
ఇవ్వటానికి
నా దగ్గిర ఇంతకంటే ఏముంది?

'బైరాగి'

# దీ పా వ ళి

దీపావళి ఉత్సవమండీ !
దీపావళి చేద్దాం రండీ !
ఆకాశం మండిద్దామా ?
పాతాళం తగలేద్దామా ?
దీపావళి చేద్దామా ?
నరకాసురు డెందుకు ? ప్రపంచ
నరకాన్నే మసిచేద్దామా ?
కాటుకలా నల్లని చీకటి
జ్యోతుల బంధించిన వాకిటి
తలుపులు పగలేద్దామా ?
తమ బ్రతుకుల ఆఖరుశ్వాసలు
వదలిన చల్లారిన ఆశల
మొగముపైన నల్లని దుప్పటి
కన్నుమిన్ను కానని చీకటి
రండోయ్! చితులు రగుల్చండీ !
చీకటి గుండెలు కలచండీ !
మంటల నాట్యపు మ్రోగేగజ్జెలు
చిటపటకాలే శవాల సెజ్జెలు
రగిలిన చితిమంటల వాదం
పగిలిన యుగ ఘంటానాదం
అది చీకటి శవసంగీతం
ఉన్మత్తుని స్వేచ్ఛాగీతం
దీపావళి తెచ్చిందండీ !
దీపావళి చేద్దాం రండీ !

జీవితాన్ని కోరనివారూ
మిా మిా కసి తీరనివారూ
వంచితులూ, భగ్నహృదయులూ
విషవధూ పరాజయ ప్రియులూ
కలలలోన బ్రతికినవారూ
అలభ్యాన్ని వెదకినవారూ
బ్రతుకురేయి పెనుచీకటిలో
బ్రహ్మాండపు నడివాకిటిలో
మిణుకుమనే జీవితదీపం
వెలుతురులో ముక్తిస్వరూపం
కొరకు వేచి కూలినవారలు
మృత్యునిద్ర తూలినవారలు
రండీ ! నిద్దుర లేవండీ !
దీపావళి పిలిచిందండీ !
భూమ్యాకాశపు హద్దుల్లో
చీకటివెలుగుల ముద్దులలో
అవే రక్త జ్యోతులధారలు
నలుదిక్కుల ఎర్రటిచారలు
చుట్టుముట్టి కాలేగుడిశెలు
తెలతెల మిా మేడలవరుసలు
బ్యాంకులు, ప్రభుత్వ భవనాలూ
ధనదేవత కేళిగృహాలు
నాగరికత కట్టినకోటలు
మురుగునీట మునిగిన పేటలు
నెత్తుట తడిసిన ఐశ్వర్యం
కుళ్ళిన చివికిన సౌందర్యం
మంటల నాలుకలతో నాకే

3

ఆకలితీరక ఎగబ్రాకే
కరువుగొనినవులి దీపావళి
గడగడ వణకుతోంది భూతలి
కాగడాలు ! లక్షలలక్షల కాగడాలు
మంటల పిల్లల ఆగడాలు
కాగడాలు భగ్గునమండీ
తరతరాల పాపం వండీ
నర్తించే ఆనలప్రవాహం
ఇది అభినవ లంకాదాహం
నెత్తురుటేరుల పాయలు అవి
బ్రతుకు నంజకెంజాయలు అవి
దీపకరాగపు కెంజడులై
ప్రపంచపద్మపు పుప్పొడులై
వెచ్చనిదిక్కుల విరిశాయి
పచ్చనిపైరుల ఒరిశాయి
జీవిత ప్రాంగణాన్ని కప్పిన
మృత్యువులా రెక్కలువిప్పిన
ఆ నల్లని చీకటి నీడలు
చూపుల చెరబట్టిన గోడలు
పగిలి వెగిలి పడిపోతున్నయ్ !
రాయిరాయి విడిపోతున్నయ్ !
పెనుచీకటి పొరలను చీల్చి
జీవితపు కల్మషం కాల్చి
గొంద్రాలొరేతిరి కడుపున
నెత్తుటి పిండంలా జారిన
దీపావళి పిలిచిందండీ
దీపావళి వచ్చిందండీ !

నైరాశ్యపు చీకటిముసుగున
దాగిన మృత్యువు నర్తించిన
పాడుబడిన బ్రతుకుల గుట్టల
రాతిగుండెల కండల చట్టుల
గణగణమని చావులగంటలు
చటపటమని పిలచినమంటలు
సుకుమారులు మంటలకాలీ
బలహీనులు భయపడితూలీ
కాలేతనువుల వాననలే
క్రమ్మినాయి నీరాజనమై
ఊపిరాడనీయని పొగలో
విషవాయువు కక్కినసెగలో
మంటలతో భాగం పంచీ
జవములేని నడుములువంచీ
జ్వాలాశేషాన్నం కొరకై
గతసంస్కృతి చిహ్నంకొరకై
వెదుకుతున్న కంకాళాలు
పశుమానవుల పటాలాలు
అంధమూఢ సంస్కారంతో
క్రూరదాస్య గురుభారంతో
జర్జరపురాణ జగతిరగిలి
విధ్వంస మహాదీపావళి
చీకటిలో చిరబంధితులూ
ఆకలితో ఆక్రందితులూ
మీకోసం లేచినమంటలు
మీకోసం మ్రోగిన గంటలు
మీకోసం చిరపాపంతో

పీడిత దరిద్రదశావంతో
క్రుంగిన ధరిత్రి కడుపుపగిలి
వెలిగిన ప్రళయప్రదీపావళి
దీపావళి వచ్చిందండీ !

# నాకు తెలుసు

నాకు తెలుసు, నాకు తెలుసు
ప్రళయవేదనా పంకిల ప్రపంచపథం మధ్య
ప్రేమలు పొనగవనీ
ఈ బండరాళ్ళపైన ఏ మొక్కలు ఎదగవనీ
మనమంతా చీకటిలో ఆకటితో పోరాడే
అస్వతంత్ర సైనికులమనీ,
పెనుతుపాను చేతుల్లో చిక్కుకొన్న
త్రోవలేని-నావికులమనీ
జీవిత ప్రభంజనం
కలయిక సహించదనీ
ఉన్నగడుపు కొద్ది అనీ
నాకు తెలుసు ! నాకు తెలుసు !

# యుగసంధి

సంధియుగం సంధియుగం !
భూగర్భ ప్రజ్వలాగ్నుల
చలియించిన జగన్నగం
సంధియుగం, సంధియుగం !
జీవనమరణ సమస్యగ
వెత్తిపైన కూచున్నది

తప్పనిసరి సంఘర్షం
త్రోవకాచుకొని యున్నది
నూతనయుగ సంగీతం
మనస్సు ఊరిస్తున్నది
పురాణ జగవ్యామోహం
వదలక పీడిస్తున్నది
జీర్ణజగతి కంఠశోషలూ
నవ్యప్రగతి శంఖఘోషలూ
ఆవరించినయ్ మింటిని
కలచివేసినయ్ మంటిని
రాష్ట్రాల ఉష్ట్రయానం
దాచిననీళ్ళు పోయాయ్
'ఎడారి ఒడలు' దాహంలో
మునిగే టట్టున్నాయ్!
నిశా నభాంచలంలో
పొడిచిందో తోకచుక్క
సొమ్మేదో పోయినట్టు
మొరిగిందో పిచ్చికుక్క
పూర్వం కట్టిన గోడలు
బెకతిలుగా ఊడాయి
వర్గాల పటాలాలే
పశువుల్లా కాట్లాడాయి
యుగాలు క్షణాలు, జగత్తొక
సంగర రంగస్థలిగా
కదలలేని కంకాళాలే
తరిగిపోని సైన్యావళిగా
కోసిన మనుషుల కుత్తుక

## 7

నెత్తురులే కాళ్ళకు లత్తుక
భీభత్స శృంగారంగా
మనుషుల కనులు రత్నహారంగా
నడచిందట ! వచ్చిందట !
సంధియుగం ! సంధియుగం !
అదిగో ! అది జనసైన్యం
మహాయుద్ధంగ ఆకలి
వజ్రకవచమా దైన్యం
మును ముందుకు సాగుతోంది
అదిదరిద్ర జనసైన్యం
మొగముపైన ఎవోదయపు
నవనవరక్త జ్యోతులు
కాళ్ళకింద నలిగిపోవు
క్రుళ్ళిన చీకటిలోతులు
వారివెనుక నిదురమత్తు
ముందునవ్య కార్యశక్తి
ఒకవైపున మంచుపొరలు
ఒకవైపున వెలుగు తెరలు
చీకటివెలుగుల కలయిక
ఏడ్పులనవ్వుల కలయిక
జీవితరంగస్థలిపై సృష్టిప్రళయముల కలయిక
ఎర్రని తెల్లని కాంతులు
ఆకాశపు కనుగొనలను
అన్నిచోట్ల దశదిశలను
నెత్తుటివెలుగుల వాంతులు
మండుతోంది భగభగభగ
రేజీకటి పెనుకాష్టం

మొరుస్తోంది ధగధగధగ
మంటల రక్త కిరీటం
అది రాలిన పండుటాకు.
ఇది మెత్తని చిగురుటాకు
చెలరేగే మంటలవమ్మది
తులదూగే పువ్వులసొమ్మిది
అవి గిలగిల తన్నుకొనే
ప్రాతయుగపు ఘోర మరణయాతనలూ
ఇవి తళ తళ ఉదయించే
నూత్నజగతి వీరప్రసవవేదనలూ
అది నెత్తుట మునిగిన ఓటమి
ఇవి నెత్తుట తేలినగెలుపులు
అవి గడిచినకాలపు ఏడ్పులు
ఇవి దూరపు తూరుపు పిలుపులు
ఇరువంకల సకలదిశల
కనుగొలకుల అరుణకాంతి
అరుణకాంతిలో పొగలా
రాజుతోన్న చిర అశాంతి
తిరుగుబాటు జెండాలా
ఆకాశం నెత్తురుతో రంగరించి అరుదెంచిన
సంధియుగం! సంధియుగం!

# పెను తుపాను

ఈ తుపాను, పెనుతుపాను
చిరజర్జర జగద్వృక్ష
మూలాన్నే కదలించే
విదిలించే, పెకళించే
ధ్వంస దేవతాశ్వంలా
పరుగెత్తె, సకిలించే
        ఈతుపాను, పెనుతుపాను.
ఆకాశపు సముద్రంలో
మబ్బుల కెరటాలజోరు
భూమిచుట్టు చెలరేగిన
ప్రళయ మహోదధులహోరు
చిరప్రశాంత, చిరప్రసుప్త
జీవిత సాగరంలోన
రేగిందొక పెనుతుపాను
జలజల ఆకులురాలీ
ఫెళఫెళ తరువులుకూలీ
తెల తెలబోయే మానవ
నిర్మిత సౌందర్యజగతి
వెలవెలబోయే వణకే
సృష్టికి ఇక యేమిటిగతి ?
చూపుల పొలిమేరదాటి
వ్యాపించిన చీకటిలో
వెలుగుదారి కననేరని
జగశ్మశాన వాటికలో

పగబట్టిన తాచుబాము
రగిలిన క్రోధాగ్ని సెగలు
ఈ తుపాను పెనుగాడ్పులు
శతాబ్దాల సమాధిలో
నిదురించే మృతజీవిత
శవముకూడ వణుకుతోంది
ఈ తుపాను మహోద్ధతికి !
యుగయుగాల తరతరాల
బంధనాల నూడ్చివేసి
ఆకాశపు టెడారిలో
జన సంస్కృతి శిధిలాల్లో
నగ్నోచ్ఛృంఖల స్వేచ్ఛా
వీరవిహారం చేసే
ఈ తుపాను ! పెనుతుపాను !
వాన ! వాన ! ఒకేవాన !
గాలి ! గాలి ! ఒకేగాలి !
చిటపట చినుచిలు కావవి !
మలయుని పులకలు కావవి !
రావణదాన్యం చేసిన
పంచభూత సంఘశక్తి
మేల్కొన్నది, మేల్కొన్నది
కోల్కొన్నది ! కోల్కొన్నది !
ఉరుముల కంఠధ్వనితో
మెరుపుల వీక్షణములతో
పాము బుసలశ్వాసలతో
మేల్కొన్నది ! కోల్కొన్నది !
పంచభూత సంఘశక్తి

ఎక్కడ ? ఆశ్రయ మెక్కడ ?
దిక్కులేని పక్షులకూ
ఇళ్ళులేని మనుజులకూ
సర్వజీవ జంతువులకు
ఎక్కడ ? ఆశ్రయ మెక్కడ ?
జలమయ మగు జగతిలోన !
యుగ యుగాల తరతరాల
పేదజనుల స్వేదధార
మానధనుల అశ్రుధార
ఆకాశపు కళ్ళలోంచి
కట్టలు తెగి పొరలుతోంది
గౌతమబుద్ధుని హృదయం
కరుణాంబుధి సముచ్ఛ్రయం
ఉప్పెనగా కప్పుతోంది
పాపకళంకిత పృథ్విని.
ఆగబోదు ఈ తుపాను
ఆగరాదు ఈ తుపాను
ఆగబోదు ఈ తుపాను
మీ మేడలు మునుగువరకు
మీ కోటలు కూలువరకు
మీ అంతఃపురకాంతలు
భూమిపైన దొరలువరకు
శోకంతో పొరలువరకు
ఆగరాదు ఈ తుపాను
మీ జీవిత నరమేధపు
యజ్ఞాగ్నులు ఆరువరకు
మీ వైభవ శిథిలాల్లో

పెనువరదలు పారువరకు
పాపతాపతప్త పృథ్వి
శోకము చల్లారువరకు
ఆగరాదు ఆగబోదు
ఈ తుపాను పెనుతుపాను.
ఏడవండి ! సుకుమారులు
ధనవంతులు, బలవంతులు,
అదృష్టపు ప్రియపుత్రులు
ఏడవండి ! ఏడవండి !
మీ చేసిన దురంతాల
దురితాగ్నుల పెనుమంటలు
మీ కార్చిన కన్నీరుల
కుంభవృష్టి ఆర్పువరకు
ఏడవండి ! ఏడవండి !
మానవసంఘం పెంచిన
పాపపంక ప్రక్షాళన
జరిగే సుదినము నేడే !
ఏడవండి ! ఏడవండి !

* * *

ఎవరువారు ! ఎవరువారు !
ఈ తుపాను హోరులోన
చావుబ్రతుకు పోరులోన
వెనుదిరగక మునుముందుకు
దీక్షతోడ సాగువారు !
ఈ భీషణ ధ్వంసలీల
లో నూతన వసంతాల
అంకురాలు చూచువారు !

ప్రేమతోడ కాచువారు !
మానవశవ మాలలతో
నిండిన సంస్కృతి పధాన
నడకలోన పెనుతుపాను
హృదయంలో పెనుతుపాను
జీవితమే పెనుతుపాను
గా సాగెడువారు ఎవరు !
ఎవరువారు ! ఎవరువారు !
ఆకాశపు గుండెచీల్చి
భూ సీమల కడుపుకాల్చి
హిమగిరి శిఖరాగ్రంపై
ప్రశాంతాబ్ధి గర్భంలో
బడవానల జఠరానల
హాలాహాల రూపమెత్తి
దౌర్భాగ్యపు దారిద్ర్యపు
యుగ యుగాల తిరుగుబాటు
పైకెత్తిన జయపతాక
ఎగురవేయువారు ఎవరు ?
ఎవరువారు ! ఎవరువారు !
జనసంఘం సిగ్గుతోడ
పారేసిన వెలివేసిన
తల్లిలేని తండ్రిలేని
అనాధశిశువులు వారే !
భవిష్య యుగగర్భంలో
నూతన జీవితజ్యోతుల
ఉదయముకై వేచియున్న
చీకటి శక్తులు వారే !

అలజడియను అశాంతియను
ఉగ్రబాలతో పెరిగిన
తుపాను బిడ్డలు వారే !
వారే తుపానుబిడ్డలు !
సాగిరండు ! సాగిరండు !
తుపాను బిడ్డల్లారా !
అనాధ శిశువుల్లారా !
చీకటి శక్తుల్లారా !
సాగిరండు; సాగిరండు !
ఈ తుపాను నీడల్లో
జలప్లవపు జాడల్లో
అడుగిడుతూ, పరుగిడుతూ
సాగిరండు ! సాగిరండు !
మీ నూతన సౌధానికి
మీ ఆశ్రయ స్థానానికి
శాంతిలోన, చావులోన
నవజీవిత విజయానికి !
నేడు కాదు, 'రేపు' మీది !
'రేపు' నాది యనుమంత్రపు
శక్తితోడ సాగిరండు !
రేపీ తుపాను ఉండదు
ఈ వరదలు దిగిపోతయ్ !
రేపు బయలుదేరునావ
చుక్కాణీ మనదేనోయ్ !
రేపుదయించెడి సూర్యుడు
మీ కొరకై తరుణారుణ
మధుకాంతుల జయమాలలు
సిద్ధంగా ఉంచుతాడు.
రేపే మీ కళ్యాణం !
తుపాను బిడ్డల్లారా !

# వేశ్య

ఆ అచ్చొత్తిన ఓరచూపులా
అవా మరుని తూపులు ?
విద్యుత్కాంతులు
చల్లనిరేయి అశాంతులు
ఎరువిచ్చిన శృంగారం
నీ తళతళ మెరిసిన గాజులు
నీ గిల్టు చంద్రహారం ?
అణా పూలు, కానీ తాంబూళం
నలిగిన చీరలు, చీకటి ముసుగులు
ఇదా నీకు జీవితమిచ్చిన బహుమానం ?
ఈ సౌందర్య ప్రపంచపుదానం ?
చీకటి కొలతల ఆత్రుత
వినిపించని మెల్లని గుసగుసలూ
క్షణమాత్రపు చూపుల సంతోషం
చెరగుచాటు పాపపు రుసరుసలూ
నిదురించిన ప్రపంచగర్భంలో
మేలుకొన్న ఆకలిలా పాపం
మిణుకుమనే ఆవీధి లాంతరుల
నీడల పొంచియున్న విధిశాపం.
ఆ ఆనందపు బేరగాని
గుండెలలో ఏదో తెలియని దడ
తట్టని తలుపుల చప్పుడు
నడువని అడుగుల సవ్వడి
గొణుగుతాడు తడబడు మాటలతో

వణుకుతాడు గడగడ
సన్నిపాత జ్వరపురోగి.
నడిరేయి పీడకలలో
మెలకువలా, వెచ్చని చెమటూరిన
చేతిలోన జారిన
మెరిసే నాణ్యాలు రెండు
ఓ వేశ్యా !
నీవంటే నాకు అసహ్యం
ఎందుకనగ  నీ కుళ్ళిన ఆంతర్యం
నా తళతళ మెరిసే బాహ్యం
మా చీకటిలోయిల లోతుల్లో
నీ పూజా శిఖరాలూ
మా పాపపు చీకటిశాపాలే
నీ మినుగురు వెలుగు వరాలూ
మా అచేతనపు మనసుల
బురదతోడ చేసినబొమ్మా !
నిన్నుచూచి కాదమ్మా నా కోపం
నీ బ్రతుకు టద్దమందున
సిగ్గులేక ప్రతిబింబించిన
మానవ జీవితాల భీభత్సం
నన్నాకర్షిస్తున్నది
కాని మరల భయపెడుతున్నది
నీదుఅధఃపతనపు లోతుల్లో
మారుమ్రోగు మానవజాతుల
క్రుళ్ళిన మనసుల బూతులు
నీబలవంతపు చిరునవ్వుల్లో
యుగయుగాల ఉప్పునిపెడ్పులు

నీచల్లని నిట్టూర్పుల్లో
బ్రతుకుటెడారుల గాడ్పులు
ప్రపంచపు ఫార్సుపైన
నీ బ్రతుకు వ్యంగ్య చిత్రం
ప్రేమలు, పువ్వులు, నవ్వులు ఉత్తరాలు, వివాహాలు
బ్రతుకు చేదుమాత్రపైన పంచదార అబద్ధాలు
మాయలు; జీవితసత్యం
దిశమొలతో నిలిచినరోజున
ద్వేషపు ప్రలయాగ్నులలో
మునిగిపోవు నీడలమోజులు
ఓ కులటా ! రూపాజీవీ !
అనాకారి బ్రతుకులదౌర్భాగ్యపు
వెక్కిరింతలా నిలచిన నీపై
నాపై జగతీతలిపై అలుముకొనే ద్వేషపుచీకటిలో
కరుడుగట్టు నెత్తుటిపాటలు
ప్రపంచమొక ప్రశ్నచిహ్నమై
నిలచును, ఉండవుమాటలు
జాలి ! జాలి !
పేరుకొన్న చీకటి ముద్దవు, ముద్దరాల !
నా గుండెల మబ్బుల్లో మెరసిన
జాలిమెరపు నిన్నేమైనా
వెచ్చగ కరిగించేవా ?
ఓ, ఎడారిబాటసారీ !
ఎండినగొంతుక, మండినగుండెల
ప్రేమదప్పిక తీర్చేందుకు,
బ్రతుకుటెండ కిగిరిపోవు.

మంచుబొట్లలా జాలాపానీయం ?
అది పెదవులపై కాదామాయం ?
ప్రేమా ? ఔను నాకు నీపై ఒక చెప్పునలవిగాని ప్రేమ.
చింకిగుడ్డపైన బిచ్చగాని ప్రేమ
చీకటిలోగుడ్లగూబ, శిధిలగృహపు గబ్బిలాలు
జీవితకారాగారంలో పెరిగిన జీవచ్ఛవాలు
ప్రేమించక ఏం చేస్తారొకరినొకరు ?
మానవులం !
నెత్తుట తడిసిన అడుగుల
కన్నీరుల ఉప్పునిమడుగుల
ఒళ్ళంతా పచ్చిపుళ్ళు, రసికారే కురుపులు,
మూగుతోన్న ఈగలు
ఎందుకు చీదర ?
జీవితపు కాళ రాత్రి, గుండెలు పిండేచలి
భగభగమండే ఆకలి
పాపపు చిరిగిన దుప్పటిలో
గడగడవణికే మనకెందుకు చీదర ?
జరగండింకా, ఇంకా దగ్గర !
వెచ్చని చలిమంట ప్రేమ
ఈ రేయి గడవలేమా ?
చక్కని సూర్యోదయాల
బంగరు కిరణాల కలలు
వెచ్చని చలిమంటల కౌగిలిలో
చక్కలిగింతలు
ఎందుకు చీదర ? రా ఇంకా దగ్గర

# చారిత్రక జ్యోతులు

జీవిత నాటకరంగపు
గడచిన బహు దృశ్యాల్లో
రంగుల తళుకుల బెళుకుల
కపట పటాటోపంలో
మరుగుపడిన వెలుగులు ఇవి !
భూనభోంత రాళాల్లో పిక్కటిలిన
గెలిచిన సైన్యాల జయధ్వానాల
వంది మాగధుల భాసిసగానాల
రక్తాక్త కృపాణాల
మంద్రమేఘ ఘోషల్లో
అణగారిన అనాధజీవుల
అరణ్య రోదన లివి !
పుక్కిటి పురాణాల, కట్టుకధల
దట్టమైన అరణ్యాల్లో
కనుపించని చిన్నిపూలు.
రారాజుల నరహంతక పరపీడక
నిరంకుశ కళంక చరిత్రల
కలుష పాపపంకిల పుటల్లో
కనుపించని వినిపించని
క్షుద్రమానవుల జీవిత పోరాటపు
భగ్నపరాజయ గాధలు !
ఆకశమంటే కోటల నిర్మించిన ఎముకగూళ్ళ
మూకకంఠ సమూహాల ఆశ్రుత ఘోషలు
పుత్రుల గోల్పోయిన మాతల, అనాధశిశువుల,

సద్యోవిధవల లోలోపల దిగమ్రింగిన
యింకిన అశృమహానదాలు
కళాప్రియుల రాజ్యాల్లో కాటకాలు
కాలువకట్టిన పాటక జనసామాన్యపు చెమటలు
ఊనరక్షేత్రాలను తడిపిన
విలువలేని నరరక్తపు సాగరాలు
మా తెచ్చిన సందేశం ! ! !
పండిన పచ్చటిపైరుల
బంగరు రంగుల ఒరిగిన చేలపైన
యోద్ధల గుర్రపు డెక్కల ధ్వంసలీల,
మదమత్త కరీంద్రాల స్వేచ్ఛావిహరణ
సామ్రాట్టుల సంకేతంపై
వర్షాషాఢపు నదులై ప్రవహించిన
మహాసైన్య వాహినిలో
కొట్టుకపోయిన జనపదాలు.
ఏమిటి ఈ చరిత్ర ? హత్యలు దోపిళ్ళుతప్ప !
లెండి ! లెండి ! దారి తొలగిపొండిక !
ప్రాపంచిక సౌభాగ్యాలకు
మెరిసే బంగరు నాణ్యాలకు
మానవమేధస్సును విక్రయించి
తమ హృదయపు వెత్తుటినమ్మిన
మిధ్యాచరిత్ర కారులూ !
రాజసభల కవికుమారులూ ! !
వినండి ! మా తెచ్చిన సందేశం !
మా వెలిగించిన జ్యోతులు
శ్రామిక జనరక్త తైల పోషితమా

ప్రభువిలాస నృత్యోత్సవ
ప్రమత్త దీపికలు కావు.
సంస్కృతి బలిపీఠంపై
ఆత్మోత్సర్గపు దీపమాలలై
వెలిగిన మేధావుల జీవితాల
ఎర్రని ఒంటరి జ్యోతులు ! !
చరిత్ర చీకటి గుడిలో
ఆశా నిగూఢ రశ్మలు !
భవిష్యయుగ యాత్రికులకు
నవ్యకథ ప్రదర్శన జ్యోతులు ! !

## ఆ క లి !

ఆకలి ! ఆకలి ! తెరిచిన
రౌరవ నరకపు వాకిలి !
హృదయపు మెత్తని చోటుల
గీరే జంతువు ఆకలి !
బ్రహ్మాండం దద్దరిల్లి
బ్రద్దలైన ఏదో ధ్వని !
అగ్ని శైల గర్భంలో
పొంగిన లావా వాహిని !
బుర్రలోన అర్ధ రాత్రి,
అడవిజంతువుల అరుపులు,
పొట్టలోన పరుగెత్తే
బిలబిల ఆకలి పురుగులు,
గుండెలుపిండే, నెత్తురు
పీల్చే, కాల్చే. ఆకలి !

ఆకలి కోకిల పలికిన
పలుకులు చెవులకు ములుకులు
దారిలేని బలిపశులకు
వధకుని కత్తుల తళుకులు
ఆకలి పాడిన గేయం
దీనుల మౌనరోదనం
ఆకలి చెప్పిన మంత్రం
పూటకు చాలు భోజనం.
ఆకలి ! తన శిశువులనే
చంపే తల్లుల ఆకలి !
పూటకూటికై శీలం
అమ్మే కన్యల ఆకలి !
చూచావా, ఎప్పుడైన
ఎంగిలికై రోడ్లపైన
కుక్కల్లా కాట్లాడే ప్రేతాలను ?
విన్నావా ఎప్పుడైనా
బరువెక్కిన గాలిలోన
ఆకలితో మరణించిన
మృతకాత్మల రోదనం ?
పాలులేని తల్లి రొమ్ము
పీడించే పసిపాపల
ఏడ్పులు వినలేదా ?
డొక్కలు అంటుకపోయిన
కన్నులు లోతుకుపోయిన
నల్లని ఎండిన మొఖాలు
కనలేదా ? కవలేదా ?

లక్షల మూసవశవాల
మెత్తని రంగస్థలిపై
ఆకలి తాండవనృత్యం !
ఆకలి ! జీవితపుష్పం
లో తొలచిన వేరుపురుగు
ఆకలి ! హాలా హాలంలో
మృత్యుదేవి నవ్వుమురుగు.
ఆకలి ! మన నాగరికత
పుట్టించిన విభీషణుడు
జీవిత ద్రౌపది చేలం
లాగే దుశ్శాసనుడు
ఈ ఆకలి హెూరు ముందు
పిడుగైనా వినిపించదు.
ఆకలి కమ్మిన కళ్ళకు
ప్రపంచమే కనిపించదు.
మీ సంస్కృతి మీ నీతులు
విభవోన్నత సుఖసంపద
బీదవాని కడుపు కరువు
తీర్చలేని నాగరికత
మా కెందుకు ముద్దకొరకు
మొగం వాచి యున్నామిట
బోనులోన చిక్కుకొన్న
జంతువులా గున్నామిట.
నిష్ఠురవ్వగా ఆకలి
పగిలించిన విధ్వంసం
ఎముకల ఒరిపిడి తెచ్చిన

ప్రళయోద్ధత సంఘర్షం
సామ్రాజ్య శవాలపైన
మూగిన ఆకలి మూకలు
వైభవ సౌధాల చుట్టు
ఎండిన డొక్కల కేకలు
మీ చుట్టూ చెలరేగిన
ఆకలి సంద్రపు హెూరూ
నలుదిక్కుల కాచుకొన్న
క్షుధిత మానవులపోరూ.
ఆకలి మంటలకాలే
మీ వైభవ స్వర్ణలంక
చూడబోరు జాలిగాను
ఎవరూ మీ చితులవంక.

## వంచిత భర్త

మురికి గుంటలో పొర్లిస తిమింగళం
నవ్వింది అమంగళం.
హృదయపు గాజుపాత్ర
తునకలుగా వగిలింది
వధ్యపశువు గొంతుకలో
చివరిమాట పిగిలింది.
నిర్భాగ్యుని గుండెల గడియారం
ఠక్కున ఆగింది.
బయర్లుకమ్మిన కళ్ళూ
వలనలకాగే ఒళ్ళూ
జీవిత మర్యాదకు
మానభంగం జరిగింది.

చెవుల్లో సప్తసముద్రాల హోరు
సగంచచ్చిన కోడిపుంజులపోరు
విషాద హాలాహలం
ఉక్రోశ దవానలం
గురితప్పని నరచాలిత టార్పీడో.
కోపగించిన విసూవియస్
కూలిన ఆశల అట్టల ఇళ్ళూ
వంచిత భర్త ఇంటికి
దౌడు తీశాడు.
నీలకంఠుని గొంతుకలో
గరళం గురగురలాడింది.
గోడ నీడ వెక్కిరించింది,
తోలు బొమ్మ కొక్కిరించింది.
విడిచిన బట్టల్లో దూషిత
సంపర్కపు దౌర్భాగ్యపు కంపూ
వంచిత భర్తకు తలవంపూ
అల్లకల్లోలమైన ఆ చేతనంలో
పడకమంచం కిర్రు కిర్రు.
హృదయింలో గుచ్చిన మండే
లోహశలాకల చుర్రు చుర్రు.

* * *

వెన్నెమ తాకిన మంచుముద్ద
పొంగిన పాలపైన చన్నీళ్ళూ
శిలపై తలపగిలిన తరంగం
పనిచేయని ఫిరంగి.
వంచిత భర్త ఇంటి కెళ్ళి
శరీరాన్ని గోడకు చేరగిల వేశాడు.

# జీవితం

ఏమి వెదుకుతున్నావూ ?
ఈ జీవిత శిధిలాల్లోనీవూ ?
చెదిరిన నీ సుఖస్వప్నాలే అవి
రంగుల రంగుల గాజుపెంకులూ
బ్రతుకు పంటలో తాలుకంకులూ
పెంటపోగులో విశ్రమించినయ్
దాగనిబ్రతుకుల రంకులు బొంకులు
చివికిన ఖాళీసిగరెట్ పెట్టెలు
మంటిని గలసిన సిగరెట్ పీకలు
గాలి అలలలో తేలియాడుతూ
నేలనువాలే కోడియీకలూ
తళుకు కాగితం, మెరిసే తగరం,
తుప్పుతినేసిన యినుపరేకులూ
మందుల పొట్లాలకు పనికొచ్చిన
చిరిగిన మాసిన ప్రేమలేఖలూ
నల్లని యెర్రని గుడ్డపీలికలు
పూర్వపుటందపు చెడినపోలికలు
గుప్పెడుదుమ్మూ, పిడికెడు బూడిద
యిది నీ మిగిలిన జీవితసంపద.
యీ బూడిదతో కలిసిపోయినవి
ఆశ, నిరాశలు, నవ్వులు, ఏడ్పులు
నెత్తుటి చుక్కలు, అశ్రు బిందువులు
కొంచెం బ్రతుకూ, కొంచెం చావూ !

ఏమి వెతుకుతున్నావూ !

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . , . . . .

ఏమి వెదుకుతున్నానూ ?
యీ బ్రతుకుల బూడిదలో నేనూ !
చావుల బ్రతుకుల సంజ వెలుగులో
ముసిరిన చీకటుల నల్లని పొగలో
అలముకొనే చిక్కని నీడలలో
చెదిరిన కలల అడుగు జాడలలో
నమ్మకాల ఆరిన రవ్వలకై
ఆశయాల వాడిన పువ్వులకై
కన్నీరుల యింకిన గురుతులకై
బూడిదలో నెత్తురు మరకలకై
నేను వెదుకుతున్నానా ?
గడచిన గొప్పదనపు ఒక కిరణం
మరచిన పాటలోని ఒక చరణం
యీ చీకటి క్షణాలు గడిపేందుకు
కదలని కాలరధం నడిపేందుకు
పూచిక పుల్ల, చిన్న ఆధారం
యీ హారపు తెగిపోయిన దారం
ఇదా నేను అన్వేషిస్తున్నది ?
ఈ ధ్వంసంలో ఆశిస్తున్నది ?
పగిలిన గుండెల నెత్తుటి చారలు
కడిగేస్తవి కన్నీరుల ధారలు
బ్రతుకు సంజ కెంజాయల గురుతులు
తుడిచేస్తవి కాటుకల చీకటులు
అలసి సొలసి నిదురించిన అలజడి
మొగముపైన నిశ్శబ్దపు గొంగడి

తిరుగుతోన్న బ్రతుకుల గానుగలో
మూల్గుతోన్న జీవాల పీనుగలు
వాటి చెమట కన్నీరు నెత్తురులు
చిట్లినఎముకలు, పిండినకండలు
తెగివేళ్ళాడే నరాలపోగులు
జరజరసాగే ఎర్రనివాగులు
విరసపు ఎండుపిప్పిగుట్టలు ఇటు
మెరుస్తోన్న నెత్తురుబొట్టులు అటు
అది తైలం, అది జీవితసారం
ప్రపంచాల దివ్వెలకాధారం
అందుకనే ఆ దీపపు వెలుతురు
క్రక్కుతోంది ఇటు ఎర్రని నెత్తురు.
ఏమిటి నే నిట ఆశిస్తున్నది ?
ఏకాంతపు చీకటి కాకున్నది ?
ఇది ఎండిన మండిన మైదానం
బూడిద నిండిన కటికి శ్మశానం
మాడిన నల్లని రెల్లు దుబ్బులూ
భూ చర్మంపై పుళ్ళ జబ్బులూ
తాకిన కరచే వాడి ముళ్ళపొద
ఈ భూముల మిగిలిన తరుసంపద
కనిపించదు ప్రాకే పురుగైనా
వినిపించదు నక్కల అరుపైనా
వెతికేందుకు ఇక్కడ ఏమున్నది ?
మంటల మాడి దుమ్ముకానున్నది ?
అంతులేని త్యాగాల నెత్తురుల
కడలిపొంగులో పీనుగ తెప్పల
నూతచేసుకొని చీకటి రాత్రులు

గడచిన మానవ జీవితయాత్రలు
చావులతీరం చేరుకున్నవా ?
యీ మృతభూమిని కోరుకున్నవా ?
మురుగులు కక్కి కటికి దప్పులతో
బొబ్బలుపొక్కి కాలి నొప్పులతో
అడు గొకదాటరాని దూరంగా
క్షణమొక మోయరానిభారంగా
చీకటు లలముకొనే చూపులతో
దడదడమనే ఎండుగుండెలతో
పరుగెత్తే ఆ పిచ్చిపాంథునికి
ఎండమావులా దాహశాంతులకు ?
ఎందుకు పరుగులు, వృధాప్రయానలు
భ్రమగొలిపే బ్రతుకులకు అడియాసలు ?
కఠినతపస్యలు బలి సమర్పణలు
నెత్తుటిపూజలు వెర్రిప్రార్థనలు
ఈ రాక్షస విగ్రహం ముందునా ?
ఈ జీవిత శనిగ్రహం ముందునా ?
యుగయుగాలుగా మ్రొక్కిన శిరముల
వణికే చల్లని మెత్తని స్పర్శల
రాపిడి చెందిన బండరాయి ఇది
కదలని మెదలని మొండిరాయి ఇది
దీనిపైన నీ దీనాలాపం
అనునయ వినయం కరుణవిలాపం
పనిచేయదు. నీ అశ్రుబిందువులు
చింది కలిసిపోతాయి ధూళిలో
ఎండి ఇంకి పోతాయి నేలపై.
యీ అనంత జీవితశూన్యంలో

రేజీకటి నిండిన దైన్యంలో
గాలి అలల అస్పష్టపు టేడ్పులు
అవి ఒంటరి జీవాత్మల మూలులు
నలుదిక్కుల చొరనేరని నీడలు
బ్రతుకుచెరల కనుపించని గోడలు
ఎక్కడ వెలుగు తెరవు యీనిశిలో ?
స్వేచ్ఛాసీమ ఉన్న దేదిశలో ?
చీకటి ! కటికి నిరాశల చీకటి !
బ్రహ్మాండం ఒక ఆరిన కుంపటి
యీ చీకటి పీనుగలో బిలబిల
ప్రాకుతున్న పురుగులు మన బ్రతుకులు
మురికిగుంటలో పొరిలే పందులు
శవంపైన ఎగిరే రాబందులు
పగటి వెలుతురుల మేలిమునుగులో
బంగరు రంగుల పసిడిమెరుగులో
తళ తళ లాడిన ధగ ధగ మెరిసిన
పలుకు పలుకులో కులికిన మురిసిన
ఆ అతులిత జీవిత సౌందర్యం
మెరపులాగ మెరసిన ఐశ్వర్యం
ఏదీ ? యీ కురూపి చీకటిలో
నలిగి నశించిందా ఒకత్రుటిలో ?
జీవితోదయపు లేతవెలుగులో
ఉషాసుందరి చీరచెరుగులో
అలముకొన్న పరిమళతరంగమది
ఏ వడ గాడ్పుల్లో నశించినది ?
ఈ పెనుచీకటి లేనిరోజులూ

బ్రతుకొక యుద్ధం కానిరోజులూ
ఒకానొకప్పుడు ఉన్నాయేమో ?
మనమూలన్యంగా వచ్చామో ?
ఏమో మరి, మనమొచ్చేసరికే
చూపుమేర వరుగెత్తేవరకే
జీవితశకటం తప్పిపోయినది.
మనలను మసితో కప్పిపోయినది
వెతికేందుకు ఇక్కడ ఏమున్నది ?
పొగగా మసిగా నుసిగాకున్నది ?
మబ్బుల్లో పసిపాపల నవ్వులు
అడవులలో వికసించే పువ్వులు
కొండలపై కులికే కిరణాలూ
రేలకు తారల ఆభరణాలూ
జీవితాని కేమిటి శృంగారం ?
కటికి వాని కేమిటి కనికారం ?
ఇవిగో ! ప్రత్యేకంగా ఉంచిన
నరికి, తరిగి ముక్కలుగా తూచిన
జీవితాల నెత్తుటి ప్రోవులు ఇవి.
అమ్మేందుకు సిద్ధంగా వున్నవి
చీకటి మూలల ఆశాభావం
ఆసుపత్రిలో గర్భస్రావం
భ్రూణ హత్య, మృతశిశువుల జన్మలు
చేసిన పాపం పట్టిన ఖర్మలు
ఉదయం నెత్తురు కందు పుట్టటం
సాయంత్రపు చితిలోన గిట్టటం
బ్రహ్మాండపు గుంద్రని నుడిగుండం

లోచిక్కిన ఈ జీవిత పిండం
గడ్డిపోచలా క్రిందికి మీదికి
తిరుగుతోంది బయిటకు రానేరక.
చీకటిగదిలో పుట్టిన పాపం
నీడలాగ వెన్నాడే శాపం
త్వరత్వరగా జీవితమే తొందర
నడుప్ చరచరా, త్వరగా, బిరబిర
జీవిత జ్వరపు వేడిలో తొందర
నీడ అదే వెనుకను నీ దగ్గిర.
అదే నీడలో ముద్దులు వలపులు
శరీరాల తప్పనిసరి పిలుపులు
జ్వరపు వేడిలో మండేకౌగిలి
లో గడగడవణికే ఆత్మల చలి
మరల పుట్టుకలు చావుల నీడలు
ఇవే ప్రపంచపు అడుగుల జాడలు
ఇది దుర్భర జీవితశృంగారం
పీనుగున్న గదిలో వ్యభిచారం
రోగిభార్యతో డాక్టరు ప్రేమలు
నర్సుల నరసాలకు ఓ, న, మ, లు
బీభత్సపు క్రుళ్ళిన దుర్గంధం
కుళ్ళులోని పురుగులకానందం
మానవదేహపు చెమట వాసనలు
కప్పేందుకు పువ్వుల సువాసనలు
మురిగిన ఆత్మల అందవికారం
దాచేందుకు తనువుల శృంగారం
మనసులనేరపు చీకటిలోతుల
మునుగులు ఆ చిరునవ్వుల కాంతులు

క్షమార్పణల్లో అభివందనములు
జయఘోషల్లో ఆక్రందనములు
నెత్తురులో మునిగిన మొదళ్ళపై
మొలచే బ్రతుకుల లేతచిగుళ్ళవి
వందలెటముల పీనుగపెంటల
పైనమ్రోగునవి గెలుపులగంటలు
క్షణమాత్రపు వణికే ఆనందం
బ్రతికినంత వరకొక నిర్బంధం
క్షణమాత్రపు ఈ మురుపులు కులుకులు
దీపకాంతిలో తళుకులు బెళుకులు
రేపటి ఉదయపు కటికివెలుగులో
నగ్నసత్యముల అచ్చ తెలుగులో
తడబడుమాటలు వణికే కంఠం
మొద్దుచూపు మొనబోయినగంటం
రంగులపూతలు వెలవెలబోతూ
తెల్లమొగంతో తెలతెలబోతూ
నలిగినపూవులాంటి సౌందర్యం
చూస్తే కలుగుతుంది ఆశ్చర్యం.
వెతికేందుకు ఇక్కడ ఏమున్నది ?
మొదటి తాకుతో నేల రాలనిది ?
ఈ అదృష్టపు అనాథ పుత్రులు
కుక్కల నక్కల ఈగల మిత్రులు
బ్రతుకువేటలో పరుగెత్తేందుకు
తెరవు లేక తప్పించుకునేందుకు
కాలురాక, వణుకుతూ భయముతో
ఈ విశాలమగు ఇసుకబయలులో

ఉష్ణ్రపక్షులై తలలువంచుకొని
కూర్చున్నారా ఆశ వదులుకొని ?
తమ నేరపు తుది తీర్పు వినేందుకు
చావుల తెరవాలటం కనేందుకు.
తమ కందని శక్తుల బానిసలై
తా మెరుగని పాపపువారసులై
తమ దైనిక జీవితపు ఊబిలో
దిగబడి, ఎగబడి పోరుకాడుతో
పయనించే ఈ మానవజాతికి
లేదా త్రోవ విముక్తికి, శాంతికి ?
కిరువు, తుఫాను, ప్రబల భూకంపం
దారుణ ప్రపంచమారణ యుద్ధం
ఈర్ష్యాద్వేషపు నరకజ్వాలలు
నలుదిక్కుల మానవ వధశాలలు
మిన్నులుముట్టే హాహాకారం
అది జీవిత దేవత జయకారం.
మృత్యుబాధలో మునిగినప్రాణికి
ఊపిరినలపక, గిలగిల తన్నుక
వచ్చే చిట్టచివరి సంఘర్షణ,
పీడకలల జీవిత యమయాతన,
మెలకువ ఎక్కడ ? ముక్తి ఎటున్నది ?
అది కాదా అందరం వెదుకునది ?
కాని ముక్తి ఎక్కడ ? ఈ చీకటి
జీవిత వృక్షపు తుది పెనుకూకటి
వేరువరకు వ్యాపించి పెరిగినది,
అన్ని తీరములు ముంచి పొరలినది.
ఈ చీకటిలో మంచుబొట్లలా

టపటపరాలే అశ్రు బిందువులు
అవే మనకు మిగిలిన ఓదార్పులు
వీడలేకపోతున్న బంధువులు
నేను వెదుకుతున్నది ఇంతేనా ?
ఈ బ్రతుకుల వెల బూడిదలోనా !

## కి ల కి ల !

గాజుల గలగల
నవ్వుల కిలకిల
చక్కని చల్లని రాతిరినిండా
చల్లనిమెల్లని రాతిరినిండా
వెన్నెల కన్నుల మంచుబొట్లతో
బరువౌ తెల్లని రాతిరినిండా
గాజుల గలగల
నవ్వుల కిలకిల
నీలాకాశపు పాలనజ్జపై
చుక్కలవే విరజిమ్మిన పూవులు
వినిపించని పువ్వుల సంగీతం
బ్రహ్మాండంలో మోగిననవ్వులు
పూచిన పువ్వుల గాజుల గలగల
నవ్వినపువ్వుల నవ్వుల కిలకిల
ఆ నవ్వుల సంద్రములో తరగల
తలపై వెలిగిన తెల్లని నురుగుల
చెదరిన ముక్కలు మెరిసే చుక్కలు
గలగల కిలకిల చుక్కల మిలమిల
ఒకే, ఒకే ధ్వని, అదే అదే ధ్వని
ప్రేలిందా ఒక తెలి నవ్వులగని
మారుమ్రోగినవి దేశ కాలములు

విశ్వవిశాల హృదంతరాళములు
మ్రోళ్ళుపోయిన దిక్కుల చెట్లవి
నూతన శాఖలతో చిగిర్చినవి !
సకలేంద్రియముల దేహ ప్రాణముల
నవద్వారముల అవే గానములు
పెనువరదలుగా పొంగిపోయినవి
గలగల కిలకిల మిలమిల తళతళ
పిచ్చి నవ్వులవి అడవి పువ్వులవి
ఆ నవ్వుల కమ్మని సువాసనలు
ప్రపంచమంతట ఆవరించినయ్
కిలకిల తళతళ లక్షలగొంతుల
లోకాన్నంతను పలుకరించినయ్
బ్రతుకుబాటలో నడిచేయాత్రల
చీకటిరేలను వెన్నెల కన్నెల
కలకల నవ్వులే కనికరించినవి
ఆ లోకపు ఆఘ్రాణం మోసే
అడవి పువ్వులే పలుకరించినవి.
అలసి సొలసి ఆవేదన చెందిన
కలగినలగి యమయాతనపొందిన
మా గుండెల మంటలలో
మా నెత్తురు పంటలలో
గణగణ మన్నవి దూరపుగంటలు
స్వప్నసముద్రపు తీరపుగంటలు
గంటల గణగణ నవ్వుల కిలకిల
గలగల కిలకిల చుక్కల మిలమిల

# వి ధ్వం స ం

ఏడ్చేవాళ్ళను పూడ్చేయండి !
నవ్వే లతలను త్రవ్వేయండి !
వాక్కుల్లో విషధారలు
దృక్కుల్లో రాక్షసికోరలు
చూపించే వాళ్ళేరండి !
పిరికివాళ్ళను నరికేయండి !
మెత్తటి మనసులు కొరికేయండి !
ఎముకలపై ఎముకలు మ్రోగించండి !
మృతశిశువుల హస్తాస్థులతో
ఊదండోయ్ ! పిల్లనగ్రోవులు
ఆర్పేయండా సూర్యచంద్రులను
చమురులేని దీపాలను
చీకటిలో ముంచేయండా
వీడల పాపాలను.
సుఖరోగ జీర్ణమైన ఆకాశపు ముఖంపైన
కప్పండొక నల్లని దుప్పటి,
నరభక్షక నిశాచర ప్రీతికి
అర్పించండొక దివాంధగీతిక
స్నేహపు సౌహార్ద్రంతో
మెత్తటి వెచ్చదనంతో
ఆడుకొన్న రోజులు గడిచాయి
మన ప్రకాశ గీతాలే మనలను
దారితెలీని చీకటిలో విడిచాయి

ఇప్పుడు నిరాశ జీవితనిశిలో
మండించండోయ్ ద్వేషపు మంటలు
పండించండోయ్! రిక్తపు పంటలు
పాతేయండోయ్! గతాన్ని
తగలేస్తిరి ప్రస్తుతాన్ని
ప్రపంచపు మహా శ్మశానంలో
చెయ్యండోయ్ శవసాధన
శక్తికి ఆరాధన
సహించకండోయ్! అత్యాచారం
గుచ్చండోయ్ పుర్రెలహారం!
చెయ్యండోయ్ నగ్నవిహారం!
వినాశ సుందరిరూపం
వీక్షించిన వాడెవడూ
వికాసజడస్తూపం
రక్షింప బూనడెవడూ
జుగుప్సమన ఆదర్శం
ప్రేయసిమన విధ్వంసం.

# తాజమహల్ పడగొట్టండోయ్!

తాజమహల్ పడగొట్టండోయ్!
వెన్నెలరాత్రుల్లో కలగా
సౌందర్య సాగరపు అలగా
మా పీడిత హృదయాల్ చీల్చి
మా ఎత్తిన తలలను వాల్చి
దరిద్రులను హేళనచేస్తూ

మానవులను చులకన చేస్తూ
ఆకాశంవైపుకు చూపే
ఈర్ష్యలతో హృదయం ఊపే
తాజమహల్ పడగొట్టండోయ్!
ధ్వంసాన్ని ధిక్కరించిన
కాలాన్ని వెక్కిరించిన
శిల్పులను విస్మరించిన
ప్రభుస్మృతులనే వరించిన
ఈ ద్రోహిని దండించండోయ్!
ఈ పాపం వండించండోయ్!
మొగ్గలుగా తుంచిన సుమాలు
పచ్చవిగా నరికిన ద్రుమాలు
జగమెరుగని ప్రేమగాధలూ
దరిద్రతా మిశ్రమ బాధలూ
ప్రభు ప్రేమల కుళ్ళు వాసనలు
మా కవి భీభత్సకల్పనలు
మా కెందుకు షాజహాన్ ప్రణయం
మానవ శ్రమ మింగిన ప్రళయం
ఈ కుళ్ళిన విలాస చిహ్నం
కర్దయి మోహపాశ చిహ్నం
తాజమహల్ పడగొట్టండోయ్!
రాయిరాయి విడగొట్టండోయ్!
అది అతీత శవదుర్గంధం
ముందడుగిడు కాళ్ళకుబందం
అది ఐశ్వర్యపు వెటకారం
గృహహీనుల హాహాకారం
తాజమహల్ పడగొట్టండోయ్!

రాయిరాయి విడగొట్టండోయ్ !
మన శ్రమతో నిర్మింపబడేదీ
మనలవే వెక్కిరించేదీ
ప్రపంచమందుండదు ఏదీ
ప్రేమకు గురుతీ పన్నీరా !
వెచ్చని బాధల కన్నీరా !
రాతిగుండెగల తాజమహల్ !
ప్రేమగురుతు గావీశిలలు.
తాజమహల్ పడగొట్టండోయ్ !
రాయిరాయి విడగొట్టండోయ్ !

# తి రి గి ర ం డి !

తిరిగిరండి ! మరలిరండి !
నవజగతికి తరలిరండి !
భగ్నాశల మృతసమాధిలో
చిరప్రశాంతి దునహావ్యాధితో
వైచిత్ర్యం లేని బ్రతుకు
గడిపే భావుకులంతా
తిరిగి రండి ! మరలి రండి !
ఈ మన బ్రతుకొక పోరాటం
సుఖదుఃఖపు అలల చెలగాటం
ఈ జీవిత జలధి ఈ
చావు బ్రతుకు తేల్చుకొండి !
తిరిగి రండి ! మరలి రండి !
మీ క్షుద్రప్రేమ గాధలూ
మీ తుచ్ఛ విరహ బాధలూ

ఈ సంక్షుబ్ధ ప్రభంజన
రణధ్వనిలో ముంచేసి
తిరిగి రండి ! మరల రండి !
నూతన సూర్యోదయ కాంతులు
సరిక్రొత్త ప్రపంచపు దూతలు
తలుపులు తట్టారదిగో !
స్వాగత మివ్వండి ! లెండి !
తిరిగి రండి ! మరలి రండి !
నవజగతికి తరలి రండి !

## కదిలించూ!

కదిలించూ ! నడిపించూ !
భగ్నాశల లోతుల్లో
పాతుగొన్న నీజీవిత
జడరథాన్నికదిలించూ !
బ్రతుకుబాట నడిపించూ !
మేల్కొల్పు మహాయాత్ర సాగింది
అలలలోన ఆహ్వానం మ్రోగింది
పెనుగాడ్పులు వీస్తున్నయ్ !
ధూళిపొరలు లేస్తున్నయ్ !
సంఘర్షణ అణువణువున పలికింది
ఆకర్షణ ప్రతిజీవిని పిలిచింది
మత్తుకునుకు పనికిరాదు
బేలపలుకు పలుకరాదు
బ్రతుకుకడలి శాంతంగా ఉండరాదు
జడసమాధి మానవునికి అండకాదు

శబ్దకిరణ వేగంతో
విత్యనవో ద్వేగంతో
జీవితగతి సాగాలి !
అమరప్రగతి కావాలి !
అడ్డంకులు తొలగించూ !
సంకెళ్ళను వదలించూ !
బాధలపై మృత్యువుపై
విజయం సంపాదించూ !

## క డు పు మం ట

అనురాగం అంబరమైతే
ఆనందం అర్ణవమైతే
మేం తోకచుక్కగా వస్తాం
బడబానలమై మండిస్తాం
ప్రపంచమొక నందనవనమై
జీవితమొక గులాబి ఐతే
మేం ముళ్ళతొడుగుగా ఉంటాం
సుఖస్వప్నం భంగపరుస్తాం
ఈ జీవిత కేళీ గృహంలో
సుఖమే ఒక విరిపాన్పైతే
మేం కాలసర్పమై వస్తాం
విషజ్వాలల ధార విడుస్తాం
మీ నిద్రాసుఖసమయంలో
స్వాప్నిక ప్రశాంతి నిలయంలో
మేం పీడకలలుగా వస్తాం
రౌరవదృశ్యం చూపిస్తాం

మీ ప్రణయోత్సుక మధుగీతం
మీ నృత్యమత్త సంగీతం
మా కటుక్షుధారోదనంలో
ముంచేస్తామొక్క క్షణంలో
మీ హేమానన పాత్రల్లో
మీ స్వప్నజగతి యాత్రల్లో
మా అశ్రుధార నింపేస్తాం
మీ బాటను జారుడు చేస్తాం.
పానకపు పుడకగా వస్తాం
టీకప్‌లో ఈగై చస్తాం
మా ప్రాణాలైనా విడుస్తాం,
మీ శాంతిని భగ్నం చేస్తాం;

## నిద్రాభంగం

పువ్వుల్లో పురుగులాగు
నైరాశ్యపు చెరగులాగు
నిశ్శబ్దంలో మృత్యువు ప్రాకింది.
వెన్నెల్లో కడలినురుగు
పొంగుతోన్న పాలమెరుగు
జీవిత పల్లవం, పాప నిద్రిస్తోంది.
మూసిన కనురెప్పల్లో
స్వప్నలోక సౌందర్యం
చలియించే పాపమోవి
పైన చిన్న నవ్వొక్కటి ఉదయించింది.
మండుతున్న కళ్ళల్లో
భీషణ రౌరవజ్వాలలు

బిగిసిన మృత్యువు పెదిమల
పైన వికృతహాసమొకటి గికురించింది.
తమతమాశ వాటికలో
ఏవో నల్లని ఛాయలు కదులాడాయి.
మబ్బుల ముట్టడి లోపల
చిక్కుకొన్న తెలితారలు పెనుగాడాయి.
పేరుకొన్న నిశ్శబ్దం
కదలొద్దని పలుకొద్దని వారించింది.
ప్రేమలేఖలై చిరిగిన
మబ్బుల్లో వెన్నెలొకటి
భయపడుతూ తొంగితొంగి చూచింది,
పక్కపైన బిక్కబోయి
నిద్రచెడిన పాపొక్కతె కూచుంది.

## గా లి వా న

జోరునకురిసే వాన
హోరున వీచేగాలి
సముద్రతీరంలో గాలివాన
అంతులేని శూన్యంలో
త్రోవతప్పిన తుఫానుమూల్గులు
తెరలోపల అదృష్టపు చిరునవ్వులు
కనుపించని ఆ ఒడ్డున
కోట్లకొలది పసిపాపలఏడ్పులు
గురితప్పని ఆహ్వానం
నావికుని మృత్యుగానం
ఆకాశపు మెరుపుల్లో

కోపించిన కడలికెరటాల తళుకులు
నాగలోక విషకన్యల కులుకులు
భూమంతా తడిపేసీ
వారిధిలోజలమూ
వారిధి గర్భంలో బడవానలమూ
ఒడ్డున వెర్రివాడు,
నలుదిక్కుల చెలరేగిన సౌందర్యం
మహా ప్రకృతి రహస్యాలు
బట్టబయలుగా నిలిచిన ఆశ్చర్యం
నురుగులు కక్కుతున్న
తరంగాల గుర్రాలు
జీవితపు ఉధృతంతో
నిలువలేని జలమూ
కొలతలేని లోతుల్లో
ఆనందపు మహోన్మత్తలాస్యం.
వెర్రివాడు తనచుట్టూ చూశాడు,
ఆనందంతో చిటికెలు వేశాడు
నీళ్ళలో కలిశాడు;
గాలివాన ఆగింది.
పసిపాపలు అలసిసొలసి
నిద్రించారు,
నురుగులు కక్కుతున్న
తరంగాల గుర్రాలో
తరలిసాగి పోయాయి
వెర్రివాడు మాత్రం
ఒడ్డున లేడు.

# నీ కోసం

నీ కోసం నీ కోసం ఈసిగరెట్ వెలిగించా!
గాలిలోన తేలిపోవు
ఉంగరాల పొగను నేనుచూస్తుంటే
నీవు నన్ను చూడాలని
నేనది గమనించి అటేచూచినపుడు
నీవు ఎటో చూడాలని
చూపులతో దోబూచులు ఆడాలని
ఈసిగరెట్ వెలిగించా నీకోసం.
నీకొరకై నే నేమీ రాజ్యాలు గెలువలేదు
సప్తసముద్రాలు దాటి పెనుగొండలు తొలువలేదు,
నలుదిక్కుల కోళ్ళుగాగ
భూసింహాసనము నీవు ప్రతిష్ఠింప
రారాజుల మౌళిరత్నరోచిస్సుల
నీ మెత్తటి పాదాలకు అభిషేకం చేయలేదు.
నీ కీర్తి పూజకొరకై పాటలపూలైనా కోయలేదు.
లేనివాణ్ణి; నా దగ్గర ఏమున్నది ఇచ్చేందుకు?
నా నెత్తురు గడ్డకట్టి; కన్నీరులు ఆవిరిగా యింకిపోయి
ఈ సిగరెట్ పొగలో
నీ సాన్నిధ్యపు సెగలో
కటికిబ్రతుకు బండరాయి కరిగేందుకు
ఈ సిగరెట్ వెలిగించా నీ కోసం, నా కోసం.
జీవిత జాగారంతో వాడిన నీ మనక కనుల
ముందునిలచి నర్తించే ఈ చిరుపొగ ఉంగరాలు
కాలుని భాండారంలో దొంగిలించి తెచ్చిన యీ

నీ తియ్యని సాన్నిధ్యపు లఘు క్షణాలు
అదృష్టం ఏమరి యిచ్చిన వరాలు.
అందుకనే ఈ సిగరెట్ వెలిగించా నీ కోసం!
శూన్యములో కలుస్తోన్న సిగరెట్‌పొగ
పరుగిడు కాలపు వడిలో నన్ను వీడుతున్న నీవు
రెప్పపాటులో ఇక మిగలదు ఏమీ;
కాని జీవితపు శూన్యం నింపేందుకు
మళ్ళీ వెలిగిన నా సిగరెట్ పొగలోనీ
జ్ఞాపకాల సువాసనలు గుబులుకొంటయ్!
నీకొరకై వెదుకుతున్న కండ్లల్లో
నీసాన్నిధ్యపు నీడలలముకొంటాయ్.
ఒకసిగరెట్ వెలిగిస్తా మరల నేను నీకోసం!

# దిక్కు లేని పక్షులు

ఏదిక్కులేని పక్షులమూ,
ఐశ్వర్యపు ప్రతికక్షులమూ,
బలిపశువుల ఆర్తధ్వని
ముంచేసిన వాద్యఘోష
మానిట్టూర్పుల మ్రింగిన
మీభీషణ హర్షహేష,
మానెత్తుట నింపినవే
మీ మధురాసవ పాత్రలు
మాశవములపై నడచిన
మీదిగంతజయయాత్రలు
మా ఎముకల గూళ్ళపైన
కట్టిన మీసౌధాలూ,

మా జీవితజ్యోతి ఆర్పి
వెలిగిన మీ దీపాలూ
మమ్మి వెక్కిరిస్తున్నయ్ !
అవహేళన చేస్తున్నయ్ !
జీవిత సాగర లహరులు
వెడగ్రక్కిన తృణాలము
నగ్రమాట్టుల ద్యూతంలో
పనికొచ్చే పణాలము
కల్పనా ప్రేతభూముల
హాస్యాస్పద ఛాయలము
మృత్యులౌహ ముష్టిలోన
చిక్కిన అసహాయులము
ఆశారుణ ప్రత్యూషల
కాంతిమమ్మి చేరదెపుడు
మా నైరాశ్యపు చీకటి
మీ జ్యోతుల సోకదెపుడు
మా అనాధ జీవిత బాధలు
మీ అనంత వినోద గాధలు.

# ఒ కే జ్యో తి

ఒకేజ్యోతి !
అచలదీక్షతో వెలిగే
జాగరూకమై మెలిగే ఒకేజ్యోతి !
నిరంతాందోళిత మానవహృదయంలో
పిరికివాని భీతిలోన, వీరుని అభయంలో
ఆశలో నిరాశలోన

తృప్తిలో దురాశలోన
విరిసిన పుష్పాల సువాసనలో
కవిగాయక ప్రేమికజన
సకలశిల్పి సౌందర్యోపాసనలో
నాట్యాంగన విన్యాసములో
యోగిజనుల సన్యాసములో
ఉరికెక్కే విప్లవకారుని
అంతిమ దరహాసములో
అనేకస్వరూపాల
శతజీవిత తరంగాల
మురుగునవ్వు దివ్వెల్లో
వెలుగుతుంది ఒకేజ్యోతి !
దుర్గమతర హిమపన్నగ శిఖరంపై
బాలారుణ కిరణాంకురమై,
దుస్తరసాగర రహస్య గర్భంలో
ఆరని బడబానలమై
విప్లవాల సుడిగాడ్పులు
కాటకాల వడగాడ్పులు
దారుణమారణ సంగ్రామపు
పెనుతుపాను హోరారులోన
జడివానల జోరులోన
ఆరక సతతము వెలిగే
జాగరూకమై వెలిగే
దివ్యజ్యోతి ! ఒకే జ్యోతి !
బరువై తోచిన ఘన తెరువు లేని జీవితాల
కరాళ కాలరాత్రిలో
అడుగడుగున కరపదముల

నిగళయుగము మ్రోగుచున్న
బానిస బ్రతుకుల చిరముతక యాత్రలో
తన కరుణా కిరణమ్ముల
నవకటాక్ష వీక్షణముల
నైరాశ్యము రూపుమాపి
మునుముందుకు త్రోవ చూపు
మహాజ్యోతి ! ఒకే జ్యోతి !
ఏజ్యోతిని వెదకి వెదకి
తెలియని సృష్ట్యాదినుండి
తెలిసిన మన యుగమువరకు
ఎందరో మహానుభావులు
అనేక విప్లవకారులు
సత్యాన్వేషణ మిషతో
త్రోవతప్పిన మతప్రవక్తలు
పేరులేని తిరుగుబాటులో కూలినజనశక్తులు
కాలాన్నెదిరించిన మేధావంతులు
తమనెత్తురు చమురుపోసి
ప్రాణాన్నే దివ్వెచేసి
నేటివరకు దేనికొఱకు
వెదకి వెదకి విసిగారో
అదేజ్యోతి, ఒకేజ్యోతి !
కన్నుమిన్ను కానరాని
చీకటిలో నడిరేయిని
గృహముపీడి ధనముపీడి
రాజ్య ప్రలోభనముపీడి
వీతరాగుడై వెడలిన
గౌతమబుద్ధుని హృదిలో

అదేజ్యోతి వెలిగిందట
ప్రభుశక్తిని నెక్కరించి
చావును తానై వరించి
మూఢజనుల అవహేళన
అవమానపు వెత భరించి
తన కంటక కిరీటాన్ని
తానై యౌదల ధరించి
శిలువెక్కిన ఏసుక్రీస్తు హృదయంలో
అదే చిచ్చు రగిలిందట
కునికిపాట్ల చీకటిలో
బాధలతో ఆకలితో
ఎదమరచిన నరజాతికి
మేలుకొలుపు పాడేందుకు
అదేజ్యోతి !
యుద్ధాల దరిద్రాల
ఈ చీకటి సముద్రాల
అవలి ఒడ్డు చూపేందుకు
ఒకే జ్యోతి ! అదే జ్యోతి !
జ్యోతి ! జ్యోతి ! ఒకే జ్యోతి !
కాని యెచట ? జ్యోతియేది ?
మన నిద్రిత హృదయాల్లో
మన ముద్రిత నేత్రాల్లో
మన బానిన భావాల్లో
జ్యోతియేది ! జ్యోతిలేదు,
జ్యోతిని కోరేవారలు
జ్యోతి పాదపూజారులు
ఈ జగజీవిత నిశిలో

నూతన మార్గంకొరకై
భూతల స్వర్గంకొరకై
వెదకే విప్లవకారులు
మీ ప్రాణం దివ్వెచేసి
మీ నెత్తురు చమురుపోసి
జ్యోతిని వెలిగించండి
మీ హృదయపు తిరుగుబాటు
ఆరిపోని నిప్పురవ్వ
ప్రపంచాన్ని మండించే
మంటల పంటలు పండించే
మీ బ్రతుకొక హారతిగా
జ్యోతిని పూజించండీ !
జ్యోతిని ఆరాధించండీ !

# చీ క టి నీ డ లు !

నీడలు ! నీడలు ! చీకటి నీడలు !
గాలిమేడలకు ఎగిరే గోడలు !
అమావాస్య, చిక్కని చీకటిలో
చలిచీమల్లా ముసిరే నీడలు !
నీడలు ! నీడలు ! ఊళ్ళూ, ఇళ్ళూ
పేదలగూళ్ళూ, కుబేరులమేడలు !
ఆకాశంలో మబ్బులనీడలు !
భూమిపైన ప్రారబ్ధపునీడలు !
కునుకుకనులలో నిద్దురనీడలు !
అచేతనంలో అద్దపునీడలు !
ప్రేమలనీడలు ! ద్వేషపునీడలు !

శాంతపునీడలు ! రోషపునీడలు !
కదిలేనీడలు ! కదలనినీడలు !
తెలిసేజాడలు ! తెలియనిజాడలు !
రంగులనీడలు, తావుల నీడలు !
తెల్లకాగితపు టావుల నీడలు
గడచిన కాలపు చారల నీడలు !
గడిచేకాలపు భారపు నీడలు !
గడువనికాలపు దూరపునీడలు
కాలసముద్రపు తీరపునీడలు !
అంతులేని బ్రహ్మాండపుతెరపై
దేశకాలముల మార్పులనీడలు !
విరహప్రణయములు, సృష్టిప్రళయములు
ఏడ్పులపై ఓదార్పుల నీడలు !
పురిటిపాప చిరునగవు పెదిమపై
పాకేచావుల పుడుగుల నీడలు !
ప్రొద్దుటిపూటల లే ఎండలపై
మబ్బులచీకటి చెరగులనీడలు !
జీవితసీమ, నీలికొండలపై
ఎండలనీడల దాగుడుమూతలు !
పూలజల్లులా చిరుకన్నీరులు !
వెలుగుకుంచతో బంగరుపూతలు !
మానవజీవిత కాళరాత్రిలో
ప్రేమచితాగ్నుల ఎర్రనినీడలు !
నైరాశ్యపు చిక్కని చీకటిలో
ఒక అస్పష్టపు కదలిక జాడలు !
రివ్వున దూసుకపోయే నీడలు !
నీడలనే వెన్నాడే నీడలు !

చీకటి మూలల ఏకాంతంలో
ఎందులకో వెదుకాడే నీడలు !
గాలిలోన మృతకాత్మల నీడలు !
నేలపైన కృతకాత్మల నీడలు !
ఆశయాల ఆకాశపు నీడలు !
వాస్తవాల యమపాశపు నీడలు !
నీడల యుద్ధం, యుద్ధపు నీడలు !
కర్తవ్యాల విరుద్ధపు నీడలు !
నిశ్చల విశ్వాసపు నీడల్లో,
సంశయాల కదులాడే నీడలు !
ఉత్సాహపు ఉరికే నీడల్లో
అనుమానపు వెనుకాడే నీడలు !
చావు పుట్టుకల కొండలోయలో
బ్రతుకుల దోబుచులాడే నీడలు !
నీడలు; నీడలజగత్తు
మానవులంతా సుఖదుఃఖాల
కోల్పోయిన అడుగులజాడలు !
వెదుకుతున్న నల్లని నీడలు !
ఘోరనిశీధపు చీంచెరగులో
మూగరహస్యపు నీలిముసుగులో
త్వరత్వరగా ముందుకు అడుగిడుతూ
తడబడుతూ మరిమరి పొరబడుతూ
పోతున్నారా ?లేస్తూ పడుతూ
నీడలు వారల మిగిలినజాడలు
నిడలు ! ని[illegible] చ[illegible]నిజాలు